Reg. No. M. 258 సం॥ చందా రు 4-0-0 అ




నెల్లూరు జిల్లా జమీందారీ రైతు సంఘపక్షమున
ప్రతిఆదివారము ప్రకటింపబడును.

ంపుటము ౧ | 23=3=30 నెల్లూరు | సంచిక

29-3-30







# కృషీవలుడు.

„సైరికా, నీవుభారతక్ష్మాతలాత్మ
గౌరవపవిత్రమూర్తివి! శూరమణివి!
ధారుణీపతి పాలనదండమెవుడు
నీహాలంబుకన్నను బ్రార్థనీయమగునె?"

„దైనికావశ్యకమ్ముల దాఁటిపోవ
వెగుర తెక్కలురాని నీయిచ్ఛలెవుడు;
పైరుపచ్చలె యవధిగాఁ బ్రాఁకుచుండు
సవిచారము, సాహసము, నిపుణతయును"

„పొద్దువొడిచినదాదిగాఁ బొద్దుగ్రుంకు
వఱకుఁ గష్టింతువేగాని యిరుగుపొరుగు
వారినంపదకై యానుఁగూరఁబోవ
వెంతనిర్మలమోయి, నీహృదయకలిక!"

„పల్లెమెల్లమె సర్వప్రపంచసీమ!
ప్రియయొకర్తె రమణీయవిగ్రహంబు!
బంగరుంబంటపొలములే భాగ్యనిధులు!
అనుదినపరిశ్రమమె మతమగునునీకు."

„ఉండితిన్నను లేక వస్తున్నఁగాని
యానచేయవు పరులకష్టార్జితంబు!
నాఁకలెత్తిన నీవంచకరగు నతిథి

# మునగాల జమీ రైతుల మహాజన సభ.

తే 23-2-1930 దీన సాయంత్రం 3½ గంటలకు మునగాల గ్రామములో మ॥రా॥శ్రీ నోరి వెంకటేశ్వర్లుగారి యాజమాన్యమునకూడిన మునగాల జమీందారీ రైతుల మహాజనసభకు హాజరైన రైతులు 3000 మంది. శ్రీయుత టి. ప్రకాశం పంతులుగారు సభకు అధ్యక్షత వహించుటకంగీకరించినను కొన్ని కారణాంతరములచే రాలేకపోయిరి. గాని శ్రీయుత దాను త్రివిక్రమ రావు పంతులు బారిష్టరుగారు అంగీకరించి రాలేకపోయిరి. యీ రైతు లాందోళన కేవలము బూటకమనిన్నీ మునగాల రాజా ప్రజారంజకుడని చెప్పుటకు గాను యీ రోజుననే నడిగూడెం గ్రామములో రాజాగారి ఫోటో హాస్పిటల్ యందు బెజవాడ సబ్ కలెక్టరు వి. యన్. హేజిమోడీగారిచే బహిరంగ పర్చుటకును, టీపార్టీ నొసంగుటకున్ను నడిగూడెం డాక్టరు యలమంచిలి సత్యనారాయణ చౌదరిగారి ద్వారా గొప్ప ఆర్భాటము చేసిరి. బెజవాడ నుంచి సి. కె. రెడ్డి. ఏ. కాళేశ్వరరావు, గూడూరు లక్ష్మణ రావు, డి. టి. రావు, టి. వెంకటేశ్వరరావు, సబ్ కలెక్టరు, వీరి హెడ్ గుమాస్తా సుబ్బరయ్యనాయుడు, ఫోటోగ్రాఫరు కే. వి. రత్నం. యక్జిక్యూటివ్ యింజనీయరు మొదలగు వుద్యోగస్తులు 1 1/2 డజను మనుష్యులు హాజరైరి అని తెలియుచున్నది. మునగాల జమీలోని రైతు వక్కడైనను నడిగూడెం టీపార్టీకి వెళ్ళకుండా బహిష్కరించిరి. మునగాల జమీలోని 42 గ్రామములందలి రైతులు పట్టుదలతో తమ రైతుల సభకు మునగాలకు వచ్చిరి. మునగాల గ్రామములో జరిగిన రైతుల మహాజన సభలో గావింపబడిన తీర్మానములు—

1.వ తీర్మానము.

"మునగాల జమీ రైతులను బలవత్తరముల బాధించి కష్టముల పాలు చేయుచున్న మునగాల రాజా నాయని వెంకటరంగారావు బహద్దర్ జమీందారుగారి పరిపాలన రైతులు భరింపజాలనిదిగనున్నదనిన్నీ ప్రభుత్వమువారు వెంటనే సదరు కష్టములను తొలగించవలసినదని యీ సభవారు మరీ మరీ ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

ఉ. యలకాల లక్ష్మారెడ్డిగారు, (రేపాల)
ఆ. రాంపల్లి లక్ష్మయ్యగారు, (చాకిరాల)
చిల్లంచెర్ల అప్పయ్యగారు, (మునగాల)

2 వ తీర్మానము.

"బెజవాడ సబ్ కలెక్టరుగారి హెడ్డు గుమాస్తా యలమంచిలి సుబ్బయ్యనాయుడుగారి తమ్ముడున్ను నడిగూడెంలో డాక్టరుగా నున్న యలమంచిలి సత్యనారాయణ చౌదరీగారు మునగాల రాజాగారి ఫోటో నడిగూడెం హాస్పటల్లో బహిరంగపర్చు ఆర్భాటమంతయూ కేవలము బూటకమని యీ సభవారు విశ్వసించుచున్నారు"

ఉ. నెల్లి కోనయ్యగారు, (నడిగూడెం)
ఆ. యలకాల లక్ష్మారెడ్డిగారు. (రేపాల)
కొల్లి వెంకయ్యగారు, (జగన్నాథపురం.)

## "మునగాల జమీ రైతుల దుర్భర స్థితి"

మునగాల జమీ 42 గ్రామములు కృష్ణామండలములో నలువైపుల నైజాము రాష్ట్రముచే చుట్టి వేయబడి వుదారస్వభావులని, జాతీయోద్యమ పోషకులని, విద్యాధికులని పేర్వడసిన శ్రీ రాజా నాయని వెంకటరంగారావు బహద్దర్ జమీందారుగారి పరిపాలనలో నున్నది. ఆంధ్రదేశములో వ్యాపించిన వర్తకజాతీయోద్యమమును, గ్రంథాలయములు, నవలా గ్రంథమాలలను, దీనబంధు పత్రికను, రాజపోషకులుగ పేరు చేయించుకుని, ఆంధ్రదేశములోని [illegible]లలో సైతము ఆయనను మంచివాడని తెలియునట్లు చేసిన మునగాల రాజాగారి జమీపరిపాలన కేవలము రాక్షస కృత్యములతోను జులుముతోను నిండియున్నదనిన్నీ, అతి అమాయకులును, నిరక్షరకుక్షులును, నిరుపేదలును, రాజ్యాంగమునకు ఆధారభూతులును అయిన మునగాల జమీ రైతుల స్థితి దుర్భరముగను, భరింపజాలనిదిగ నున్న దనిన్నీ మనవి చేయుచున్నాము, గత 10, 12 సంవత్సరముల నుండి మునగాల జమీ రైతులు దుస్థితిని గురించి ఘోషిస్తుండినను అరణ్య రోదనములాయెను. ఆ జమీ రైతుల యిక్కట్టుల నిట కొన్నిటి నుదాహరించుచున్నాము.

(1) మునగాల జమీ గ్రామములన్నియూ గవర్నమెంటు సర్వే చేయబడక జమీందారుగారే స్వంతముగ సర్వే చేయించి పట్టా ముచ్చిలికాలు జారీయా చేయించిరి. న్యాయముగ రైతా భీనములోనున్న భూమి యం 4-0 లయితే పట్టాలలో రాజాగారు చేయించిన అంకెలు యం 6-0 లుగ నుంటూ శిస్తు వసూలు చేయుచుండిరి.

(2) నిర్బంధముగ మీద భరింపజాలని దుష్ట షరత్తులను పట్టా ముచ్చిలికాలలో వ్రాయించి విద్యావాసన లేని రైతులను చిటికి మాటికి కోర్టులకు త్రిప్పుట.

(3) జమీ గ్రామములలో వక్క రాజాగారి నివాసస్థలమైన నడిగూడెం గ్రామములో తప్ప మిగతా వాటిలో ఎలిమెంటరీ పాఠశాలలు లేకుండ చేయుట.

(4) 1908 సం॥ దస్తులా ప్రకారం రైతా భీనపు భూములలోని చెట్లయందు హక్కు లేకుండ చేసి వ్యవసాయపనిముట్లకు డబ్బు వసూలు చేయుట.

(5) జమీలోని పంటచెరువులను మొదలగు, మాదిక, బావులను స్వాధీనమందుంచి రైతు సాగు భూములకు సకాలములోను అవసరమున్నప్పుడును, నీరు యివ్వక పంటలకు నష్టములు కలుగజేయుటయు, రాజాగారి స్వంతముగా ఖాతాభూములకు మాత్రము నీరు సమృద్ధిగా పెట్టుకొని పండించుకొనుటయు.

(6) న్యాయముగా పంటలు పొందవలసిన రిమిషన్ యివ్వ ఆచారమున్నను రిమిషన్ యివ్వకుండుటయు, శిస్తు అడిగిన పరిహారము చెల్లించకపోయిన చెట్లను గుంజలు కట్టించి బండలు మోస్తుంటే కొట్టుటయూ, రయితుల పశువులను తోలుకొనిపోవుటయు జరుగుచుండుట.

(7). మునగాలజమీ 42 గ్రామములలో జరిగే అన్ని సివిల్ క్రిమినల్ వ్యవహారములు రాజాగారే పంచాయతీ చేసుకొని వ్యవహరించుటయు, ధనాపేక్షతో ప్రజలనుండి అపరాధము గుంజుట.

(8) రయితుల పట్టాభూములలో తీయించుకున్న స్వంత నూతులక్రింద చేసుకున్న పల్లపు పాటుకు యకరం 1 కి రు 12-0-0 లు, రు 8-0-0 చొ॥ నీటితీరువ వసూలు చేయుట.